యువరాజు గోపనముగ మందిరమున కలిసి, అన్ని విషయ ముల స్థిరపరచుకొనిరి

గోవిందమాణిక్య

ఆజన్మ బంధముల త్రెంచుటకు, రెండు నిముసము లలో స్థిరపరచివేసిరా? అయ్యో, విధీ!

చంద్రపాలుడు

దేవతకడకు నరక్తమును తెచ్చియిచ్చుటకు

గోవిందమాణిక్య

దేవతకడకా! అటులైన నతడు శత్రునిది దోషము లేదు దేవత పేరున మానవులు మానవత్వమును పోగొట్టుకొనెదరని తెలిసికొంటిని భయము లేదు, పొమ్ము నీ పనికి నీవు పొమ్ము నేను సావధానముగ నుండెదను

(చంద్రపాల్ ప్రస్థానము)

రక్తము కాదు, పుష్పాల తెచ్చితిని, మహాదేవీ, భక్తి మాత్రమే, హింస కాదు, బీభత్సపరచు భీషణ స్వప్నము కాదు

తల్లీ, జననీ, ఈ జగత్తున దుర్బలురు మిక్కుటముగ అసహాయులు బాహుబలమే మిక్కిలి నిష్ఠురము, స్వార్థము మిక్కిలి క్రూరము, లోభము మిక్కలి దారుణము, అజ్ఞా

ంము మిక్కిలి అంపెము, గర్వము ఉంకా గొంకులు లెక
క్షుద్రుల కాళ్లక్రింద ఎలిప, నలిమివేయుచు వెడలు చుండును
స్నేహము, ప్రేమ శ్రీ ఌవృంతముల వ్రేలాడు చుండు చోటున,
స్వార్థపు స్పర్శచే ఒక్క నిముసములో ఊడిపడిపోవు
చుండును

తల్లి, నివును ఖడ్గమెత్తిన, నాలుక చాపిన, అంతయు
అంధకారమగును ఇక సోదరుడు సోదరుడుగా నుండజాలడు
పతియెడల సతి హానియగును బంధువులె శత్రువులయ్యెదరు
మానవవాస గృహములు శోణితమున పంకిలమగును
హింసయే పుణ్యమగును, దయనిర్వాసితమగును

ఇక వలదు ఇక వలదు, ఛద్మవేషము వదలుము
ఇంకను సమయముకాలేదా? ఇప్పటికిని నీ ప్రళయరూపము
మిగిలి ఉండవలయునా? ఇదో నాల్గువైపులనుండి, నాశిరస్సు
నుద్దేశించి రేచియున్న ఖడ్గములన్నియు, మాతా, ని చతు
ర్భుజములనుండియేనా? అటుల కాగలదా? అట్లే కానిమ్ము
బహుశా, నా రక్తపాతముచే హింసానలము ఆరిపోగలదు
కాబోలు ఇంతెటి హింసను ధరణి సహింపజాలదు

రాజహత్య! సోదరులచే సోదరహత్య! సకల ప్రజల
హృదయములయందు వేదన తగులగలదు! సకల సోదరుల
ప్రాణములు భోరున ఏడ్వగలవు నా రక్తముచే హింస
యొక్క మాతృవేషము తుదముట్టగలదు, రాక్షసి ఆకా
రము ప్రకాశింపగలదు ఇది నీదయా విధానమేమైన, అటు
లనే కానిమ్ము

(జయసింహుని ప్రవేశము)

జయసింహ

చండి, చెప్పుము, నిజముగ రాజరక్తము కావలెనా? ఇప్పుడె చెప్పుము, ని నోటితోనే చెప్పుము, మానవభాషలో చెప్పుము, వెంటనే చెపుము నిజముగ రాజరక్తము కావలెనా?

(చెవియొగ్గి)

కావలెను

జయసింహ

అటులైన మహారాజా నీ ఇష్టదేవతల ప్రార్థనల పూర్తి చేయుము నీ కాలము సమీపించినది

గోవిందమాణిక్య

ఏ మయ్యెను, జయసింహా!

జయసింహ

నిజకర్ణములతో నీవు వినలేదా? నిజముగ రాజరక్తము కావలెనాయని అడిగితిని దేవి స్వయముగ 'కావలెను' అని చెప్పినది

గోవిందమాణిక్య

దేవికాదు జయసింహా, వెనుకనుండి రఘుపతి చెప్పెను పరిచితమగు స్వరము!

చెప్పినది రఘుపతియా? వెనుకనుండియా? వలదు వలదు ఇక వలదు కేవలము సంశయములనుండి సంశయములకు దుముకుచుండజాలను తీరమునకు రాగానే, ఎవరో నన్ను తిరిగి లోతుగనున్న ప్రవాహములోనికి నెట్టుచున్నట్లున్నది అదే అవిశ్వాసమను దైత్యుడు ఇక వలదు గురువు కానీ, దేవి కాని, ఇదేమిటి!

(కత్తిని క్రిందవేసి)

పువ్వుల గైకొనుము తల్లి, తీసుకొనుము తల్లి, పువ్వుల తీసుకొనుము తల్లి! పదముల తాకెదను, నీ కానుక కేవలము పువ్వులతోనే కానిమ్ము ఇక రక్తమువద్దమ్మా! ఇక రక్తము వద్దు ఇవికూడ రక్తమువలె ఎర్రగనున్నవమ్మా, ఈ రెండు దానానిపువ్వులు బిడ్డల రక్తపాతముచే, బాధపడుచున్న భూదేవి ప్రేమవేదనవలె, పృధ్వియొక్క మాతృవక్షమును, చీల్చుకొని లేచి వికసించినవి గ్రహించి తీరవలయును, వీటిని నీవు గ్రహించి తీరవలయును నీ రోషమునకు నేను వెరచుటలేదు రక్తమును ఇవ్వను నా కండ్లను ఎర్రచేయుచున్నావా! నీ ఖడ్గమును ఎత్తుము, నా స్మశానదళముల తెమ్ము నేనుమాత్రము భయపడను

(గోవిందమాణిక్యుల ప్రస్థానము)

అయ్యో! ఇదేమాయెను! దేవి, గురువు—మరి ఉన్న సర్వస్వము ఒక్క క్షణములో త్యజించితినే! ఇక జగతిలో మిగిలిన దేది?

(రఘుపతి ప్రవేశము)

రఘుపతి

అంతయు వింటిని అంతయు చెడిపోయెను ఒరే కృతఘ్నుడా! ఏమి చేసితివిరా!

జయసింహ

ప్రభూ! శిక్షింపుము

రఘుపతి

అంతయు ధ్వంసము చేసితివి బ్రాహ్మణకోపమును సగముమార్గమునుండి మరల్చివేసితివి గురువాక్యము నుల్లంఘించితివి దేవి ఆదేశమును వ్యర్థమొనర్చితివి నీ బుద్ధినే అన్నిటకన్న లధికమైనదానిగ చేసితివి ఆజన్మపు ప్రేమ ఋణమును ఈరీతిగగదా! నీవు తీర్చునది?

జయసింహ

తండ్రి, శిక్షనొసగుము

రఘుపతి

ఎట్టిశిక్ష నొసగగలను?

జయసింహ

ప్రాణశిక్షను

రఘుపతి

కాదు, దానికన్న గురుశిక్ష కావలెను దేవి చరణముల స్పర్శింపుము

జయసింహ

స్పర్శించితిని

రఘుపతి

పలుకుము నేను శ్రావణ అమావాస్య నాటికి దేవి చరణములకు రాజరక్తము తెచ్చియిచ్చెద!

జయసింహ

నేను శ్రావణ అమావాస్యనాటికి దేవిచరణములకు రాజరక్తమును తెచ్చియిచ్చెద

రఘుపతి

పొమ్ము

---

# తృతీయ అంకము



## ప్రథమ దృశ్యము

మందిరము

[కొంతమంది ప్రజలు, రఘుపతి, జయసింహులు]

రఘుపతి

మీరందరిచ్చటికేల వచ్చితిరి?

అందరు

మేము అమ్మవారిదర్శనంకోసం వచ్చాం

రఘుపతి

నిజమే, దర్శనంకోసం వచ్చితిరా? మాకంకా రెండు కళ్లు ఉండడం మీ అబ్బలపుణ్యాం అమ్మవారు ఎక్కడ, అమ్మవారు ఈ రాజ్యమునువదలి వెళ్లిపోయింది మీరు ఆమెకోసం చేసిన దేమిటి? ఆమె వెళ్లిపోయినది

అంగరు

ఎంతెటి ఆపత్తు ! ఇదేమినాటి స్వామి ! మేమేమి చేశాము ?

నిస్తారిణి

మాచెల్లెలి బిడ్డకు జబ్బుగా ఉండింది అందుకని కొన్ని దినాలు పూజచేయడానికి రాలేకపోతిని

గోవర్ధన

నేను రెండుపొట్లేళ్లను అమ్మవారికి ఇస్తామనే అనేక దినములుగ అనుకొంటుండినాను ఇంతలోకే రాజు బలిని ఆపివేశాడు నేనేమి చేసేది ?

హారు

విడుగో మా గంధమాదినుడు మొక్కుకొని, చెల్లుబడి చేయలేదు, కాని అమ్మవారుకూడ వాడికి తగిన శాస్తి చేసింది వాడి పిత్తకోసం పెరిగి మద్దెలమాదిరి అయిపోయింది నేటికి ఆరుమాసాలనుంచి మంచంలో పడివుండాడు మంచిదె అయింది వాడు మనకు అప్పు సొప్పు యిచ్చేవాడని, తల్లిని మోసం చేయడమా !

అక్రూర

ఒరేయి ఊరకుండండిరా ఊరక అల్లరిచేయకండి అయ్యా, స్వామీ, అమ్మవారు ఎందుకు వెళ్లిపోయింది ? మేమేమి తప్పుచేశాము

రఘుపతి

అమ్మవారికొరకు ఒక్క బొట్టు నెత్తురు ఇవ్వలేక పోతిరి ఇదేకదా మీ భక్తి?

చాలమంది

రాజుగారి ఆజ్ఞకు మేమేమి చేసేది?

రఘుపతి

రాజు ఎవరు? తల్లి సింహాసనము, అయితే రాజు సింహాసనమునకు వందనా! అయితే, ఈ తల్లి లేని దేశంలో, మీరాజుతోనే ఊరేగండి చూస్తాము మీరాజు ఎట్లా రక్షించునో

(అందరూ గొణగొణుకుని తమలోవారు మాట్లాడుదురు)

అక్రూర

ఊరకుండండిరా బిడ్డలు తప్పుచేస్తే, తల్లి దండించాలగాని, ఒకేసారి వదలిపోవడం తల్లికి తగినపనేనా? చెప్పండి, ఏమిచేస్తే, తల్లి తిరిగివస్తుంది

రఘుపతి

మీరాజు రాజ్యమువదలి వెళ్లినగాని, తల్లి ఈ రాజ్యములో అడుగుపెట్టును

(మౌనముగా ఒకరొకరు ముఖములు చూచుకొందురు)

రఘుపతి

ఇదో యీగు చూడండి ఇట్లా రండి అనేక ప్రాంతములనుండి ఎక్కువ ఆశతో అమ్మవారిని చూచుటకు వచ్చితిరి, ఒకసారి ఇట్లా చూడండి

[మందిర ద్వారోద్ఘాటన ప్రతిమపశ్చాద్భాగము
కానవగును]

అందరు

అదేమిటి? అమ్మవారి ముఖము ఏ ప్రక్కన!

అక్రూరం

ఒరే, తల్లి పెడమొగము పెట్టింది రా

అందరు

తల్లీ, తిరిగి నిలబడవమ్మా తల్లీ తిరిగి నిలబడు ఒక్కసారి తిరిగి నిలబడు తల్లి ఏది తల్లి ఏది మేము నిన్ను తిరిగి తెస్తాము, అమ్మా మేము నిన్ను వదలము మాకు మా రాజువద్దు రాజు పోతేపోవనీ, చస్తేచావనీ

జయసింహ

(రఘుపతివద్దకువచ్చి) ప్రభూ! నేను ఒక్క మాట కూడ పలుకకూడదా?

రఘుపతి

పలుకకుండును

జయసింహ

సందేహమునకు ఎట్టి కారణము లేదా?

రఘుపతి

లేదు

జయసింహ

అంతయు నమ్మియే తీరవలయున

రఘుపతి

అవును

(అపర్ణ ప్రవేశము)

అపర్ణ

(ప్రక్కకువచ్చి) జయసింహా, రమ్ము జయసింహా, ఈ మందిరమును వదలి శీఘ్రముగ రమ్ము

జయసింహ

వక్షము బ్రద్దలగుచున్నది

(రఘుపతి, అపర్ణ, జయసింహుల ప్రస్థానము)

( రాజు ప్రవేశించును )

ప్రజలు

మహారాజ, రక్షింపుము మమ్ము రక్షింపుము, తల్లిని తిరిగి వచ్చేటట్లు చేయండి

గోవిందమాణిక్య

బిడ్డలారా వినుడు తల్లిని తిరిగి తెచ్చుటయే నా హృదయపూర్వకమగు అభిలాష

ప్రజలు

మహారాజాకు జై ! మహారాజాకు జై !!

గోవిందమాణిక్య

ఒకతూరి మిమ్ములను అడిగెదను, మీరు తల్లి గర్భమున జనించలేదా? పిల్లలారా, మాతృస్నేహసుధను మీ కోమలహృదయముల మీరు అనుభవించిన వారలే

చెప్పండి మాన్నాను తల్లి లేదా? అన్నిటకన్న మాతృప్రేమ పవిత్రము, ప్రాచీనము, సృష్టియొక్క తొలి క్షణముననే, మాతృప్రేమ మాత్రము ఒంటరిగ మేల్కొని, లేచి కూర్చుండి తరుణవిశ్వమును ఒడిలో గైకొని నత నేత్రములతో చూచుచుండెను

నేడును ఆ పురాతన మాతృప్రేమ ధైర్యపుమూర్తియై నిలచియున్నది. ఎన్నెన్ని ఉపద్రవముల ఎన్ని శోకముల, ఎన్ని వ్యథల, ఎన్ని అనాదరముల సహించినది. కండ్ల ఎదుటనే అన్నదమ్ములలో ఎంత రక్తపాతము, ఎంత నిష్ఠురత, ఎంత అవిశ్వాసము!! నోటమాటలేక వేదనను సహించియు, దుర్బలుల కొరకు ఒడిచాచి, నిరుపాయులగు వారికై సమస్త హృదయమును సమర్పించి, తల్లి ఇప్పటికి కూర్చొనియున్నది. ఆ పరిమితిలేని ప్రేమ, అనాథప్రపంచమును విరమాతృహీన మొనర్చి వెడలునంతటి అపరాధము మనమేమి చేసితిమి? బిడ్డలారా, తల్లులారా చెప్పుడు, నిర్భయముగ చెప్పుడు, అంతటి అపరాధమును చేసితిమా?

కొందరు, కొందరు

తల్లి పూజను నిషేధించితివి. తల్లి బలి అగుపోయెను

గోవిందమాణిక్య

బలిని నిషేధించితిని, ఆ ఆగ్రహమునవా విముఖయగుట, మహాజాడ్యములు, దుర్భిక్షములు, అనావృష్టులు అగ్నిదహనములు, రక్తపాతములు కలుగుచుండుట!

మన తల్లి అట్టివంట తల్లియేనా? అనుక్షణము క్షీణశిశువునకు స్తన్యమిచ్చి బ్రతికించి పాలించు తల్లి, ఆ బిడ్డ

రక్తపానపు ఆశతోనా, యింత ప్రేమ చూపించుట! ఇట్టి మాత్ర అవమానమునకు మనమున స్థానమొసగినవాడు, ఆజన్మమాత్రప్రేమ స్మృతిలో విపరీతపు వేదన కలుగలేదా?

తల్లి ముఖము మనస్సునకు రాలేదా? రక్తము కావలె, రక్తము కావలెనని తల్లి గర్జించుచున్నదా? నిస్సహాయ దుర్బలములగు జీవములు ప్రాణభయమున గజ గజ వణంకిపోవలయునా—దయాహీనులగు స్త్రీ పురుషులు రక్తమత్తతచే విందులు త్రొక్కుటయా! ఇదంతయు తల్లికి సంబంధించినదేనా? బిడ్డలారా! ఇదేనా మన తల్లియొక్క ప్రేమపు చిత్రము

ప్రజలు

మూర్ఖులము మేము, మాకేమీ బోధపడదు

గోవిందమాణిక్య

బోధపడదా! ఏదియు తెలియజాలని రెండు నాళ్ల బిడ్డకూడ తల్లిని తెలిసికొనునే! భయముకలిగిన తల్లివద్ద భయములేదని, ఆకలి కొన్న మాత్ర స్తనములలో క్షీరము యున్నవని, నొప్పికలిగిన తల్లి ముఖముచూచి యేడ్చుటకును సహితము ఆ బిడ్డకు తెలియునే!

తల్లిని మరచిపోవునంతటి ఏమరుపాటుగా, భ్రాంతి యందు ఉన్నారా! మీరలు మాత దయామయి అని

తెలిసికొనలేకపోయిరా! జవ జననిపూజ జీవరక్తముతో కాదు, ప్రేమతోనని తెలిసికొనజాలకపోయిరా? భయమున్న చోట్ల తల్లి లేదని, హింసగల తావున మాత లేదని, రక్తము కారుచోట తల్లి కన్నీరును కార్చునని తెలిసికొనలేక పోయిరా?

ఓ బిడ్డలారా! తల్లి ముఖమున ఎంతెంత వేదన, ఎంత విలపించుదయను కాంచితినో, కరుణాయుతమై తనతళ మెరయు ఆమె నేత్రములలో ఎంత తిరస్కార పూరితమైన దూషణను తిలకించితినో, మీకెట్లు జూపగలను? నేనె చూపగలిగితినేని, ఆక్షణముననే మనతల్లిని మనతల్లియేయని మీరు తెలిసికొనెడి వారలు

దయామయి, మందిరద్వారము కడకు, మాతృ సింహాసనమునుండిదిగి కళంకచిహ్నములను అశ్రుజలములతో కడిగి తుడిచి వేయుటకు దీనవేషమున రాగా, నా అపరాధ ముచే రోషపూరితయై తల్లి నిష్క్రమించినదని మీరలు అభిప్రాయపడుచున్నారే!

(అపర్ణ ప్రవేశించును)

ప్రజలు

నివే గమనించి చూడుము, బిడ్డలపై తల్లి విముఖియై యుండుట

అపర్ణ

(మందిర ద్వారముపై నెక్కి) తల్లి విముఖియాయెను! అమ్మా! తల్లీ మేము చూచునట్లు ఎదురుగా ఒక తూరి రమ్ము మాతా! (ప్రతిమను త్రిప్పి) ఇదో చూడుడు, తల్లి ముఖమును త్రిప్పనది

అందరు

తల్లి కరిగినది! జయము, జయము, మాతా! జయము (అందరు కలసిపాడెదరు)

నిలువజాలక పోతివమ్మా
నిలువజాలక పోతివి
ఒడిలోని బిడ్డల
వదలజాలక పోతివి
దోషముల్ తండోపతండం
బులను సల్పినవారము
ఘశిక రోషము కలిగి యుంటివి
కడకు మోమును త్రిప్పిమాకున్
అభయవాదము అవలకున్ తీ
యంగజాలక పోతివి॥ ని॥ (అందరు ప్రస్థానము)

(జయసింహా, రఘుపతుల ప్రవేశము)

జయసింహ

సత్యము చెప్పుము, ప్రభూ, ఏదేనా ఈ పని?

రఘుపతి

సత్యమేల చెప్పనేరను? సత్యము వచింప వెరచు వాడను కాను. ఇది నాపనియే. ప్రతిమ ముఖమును త్రిప్పినది నేనే. ఏమి చెప్పదలచితివి చెప్పుము. గురువుగు గురువైనావు, నీవు ఎన్నెమి దూషింపవలయునో దూషింపుము, ఏమి ఉపదేశము చేయవలయునో చేయుము.

జయసింహ

నాకు చెప్పుటకేమియు లేదు

రఘుపతి

ఏమియును లేదా? నన్నడుగుటకెట్టి ప్రశ్నయు లేదా? మనమున సందేహము జన్మించిన దాని మీమాంసకై గురు ఉపదేశమును కోరవా? ఓహో, ఇంత దూరమైపోతివా? మనస్సున ఇంతటి విచ్ఛేదము ఘటించెనా!

మూఢుడా, వినుము. సత్యముగ దేవి విముఖమాయెను, కాని అట్లని ప్రతిమ ముఖము తిరుగజాలదు

మందిరమున మనము జరిపించు రక్తపాతమును దేవి పానము చేయును, కాని ప్రతిమాముఖమునకు ఆ రక్తము ఎక్క జాలదు దేవతయొక్క అసంతృప్తి ప్రతిమా ముఖమున కన బడజాలదు కాని మూర్ఖులకు తెలియపరచుటెటుల?

కండ్లు చూడనేరని వస్తువుల చూచుటకు కండ్లు కోరుచుండును అందుననే మిథ్యలో సత్యమును తెలియ పరచవలెను మూర్ఖా, నీ నా హస్తములలో సత్యములేదు సత్యపు ప్రతిమ సత్యముకాదు, మాటలు సత్యములుకావు, వ్రాయబడినవియు సత్యములుకావు మూర్తి సత్యముకాదు చింతలు సత్యములుకావు సత్యము ఎచ్చటనున్నది! అది ఎవరికిని తెలియదు ఎవరును దానిని పొందనేరరు

ఆ సత్యమే కోటిమిథ్యారూపముల నాలుగువైపుల బద్ధమై పడియున్నది అందుననే సత్యము మహామాయ యను నామమును వహించుచున్నది, దాని అర్థము మహా మిథ్యయని సత్యమను మహారాజు రాజ అంతఃపురమున కూర్చొనియుండును శతమిథ్యలు దాని ప్రతినిధులై, నల్గడల ఆధిపత్యము చెలాయించుచుండును

తలపై చేతులుపెట్టుకొని కూర్చొని మరల మరల ఆలోచించుము నాకు అనేక పనులున్నవి ప్రజల మన స్సులు మరల తిరిగిపోయినవి

జయసింహ

ఏ తరంగము తీరమునకు గొని తెచ్చునో, అదే తిరిగి అగాధమధ్యమునకు లాగికొనిపోవును సత్యము లేదు, సత్యము లేదు, సత్యము లేదు అంతయు మిథ్య మిథ్య, మిథ్య దేవి ప్రేమలో లేదు మరి ఎచ్చట నున్నది? ఎచ్చటను ఆమె లేదు దేవి లేదు మిథ్యావగు నీవు దన్యావు, దన్యావు, దన్యావు

---

## ద్వితియ దృశ్యము

[ప్రాసాదకక్ష్యము – గోవిందమాణిక్య చంద్రపాలుడు]

చంద్రపాలుడు

ప్రజలు కుట్రలు పన్నుచున్నారు మొగల్ సేనాపతి అస్సాంవైపులకు యుద్ధమునకై వెడలెను దగ్గరనే యున్నాడు, మూడు నాల్గు దినముల ప్రయాణములోనే నిన్ను సింహాసనమునుండి దూరమొనర్చుటకై మొగల్ సేనాపతికి ప్రజలు వర్తమానమును పంపెదరట!

గోవిందమాణిక్య

నన్ను దూరమొనర్చుటకా! నాయెడ యింత అసంతృప్తియా?

### చంద్రపాలుడు

మహారాజా! ఈ సేవకుని అనునయమును మన్నింపుము ఈ కంస ప్రజలకు పశురక్తము అంత ప్రీతికరమైన, వారికి పశువుల నిమ్ము - వారి రాక్షస ప్రవృత్తి ఆ పశువుల మీదనే పోనిమ్ము

ఎప్పుడు ఏమి జరుగునో యని సర్వదా భయమగుచున్నది

### గోవిందమాణిక్య

ఏమగుచున్నదని తెలియును, చంద్రపాలా, రాజకార్యముల భయము కలదని తెలియును ఈ అపార జలరాశి యందు సుడిగుండములు మెండుగ నున్నను, తరిని తీరమునకు కొనిపోవలసియేయున్నది

ప్రజలదూత మొగలులకడకు పోయెనా?

### చంద్రపాలుడు

ఇంతలో పోయియుండును

### గోవిందమాణిక్య

చంద్రపాలా, నీవును వెడలుము, మొగలుల శిబిరము కడ, దగ్గర దగ్గరగా ఉండి, ఎప్పుడు ఏమి జరుగుచుండునో, వార్తల పంపుచుండుము

(నక్షత్రరాయల ప్రవేశము)

నక్షత్రరాయలు

(స్వగతము) ఎచ్చటికి పోయినను, అందరును "రాజువయ్యెదవా, రాజువయ్యెదవా?" అని అనుచున్నారు ఇది పెద్ద ఆశ్చర్యకర వ్యవహారముగ నున్నది ఒంటరిగ కూర్చొనియున్నను, రాజువయ్యెదవా రాజువయ్యెదవా, యని ఎవరో అడుగుచున్నట్లు వినుచుందును రాజువయ్యెదవా, రాజువయ్యెదవా యని మాత్రము పలుకగల రెండు రామ చిలుకలు నాచెవులలో నివాసము చేయుచున్నవా యనున ట్లుండును మంచిదే అట్లనే అయ్యెదను, కాని, నాయనా, రాజరక్తమును మీరు తెచ్చియిస్తారా?

గోవిందమాణిక్య

నక్షత్ర! (నక్షత్ర నివ్వెరపడిపోవును) నక్షత్ర! నన్ను నీవు చంపెదవా? చెప్పుము, సత్యము చెప్పుము, నన్ను చంపెదవా? అహర్నిశలు ఈ విషయమే నీ హృదయమున తాండవమాడుచున్నదా? ఈ విషయమును మనస్సున ఉంచుకొనియేనా నాతో నవ్వుచు మాట్లాడుచున్నావా, పాదముల ప్రణామముల చేయుచున్నావా, నా ఆశీర్వాద ముల గ్రహించుచున్నావా, మధ్యాహ్నభోజన వేళల

ప్రక్క-ప్రక్క కూర్చొని నాతో భోజనము చేయుటయు, ఈ మాటను మనస్సున ఉంచుకొనియేనా?

గుండెలో కత్తితో పొడిచెదవా? సోదరా! నీ చరణములు తొలుత ఈ కఠినమర్త్యభూమిపై అడుగిడినపుడే నా ఈ వక్షమునకు నిన్ను అదిమి ఎత్తుకొంటిని జనని శిరముపై తుదిసారి ప్రేమహస్తమునుంచి, ధరాధామమును శూన్యమొనర్చి వెడలిననాడు, నిన్ను ఈ వక్షమునకు అదిమి ఎత్తుకొంటిని—నేడు అట్టి నీవే ఆ వక్షముననే కత్తితో పొడిచెదవా?

పితృపితామహులనుండి ప్రవహించుచువచ్చి చిరదినములుగ సోదరుల నాళనాళములయందు ప్రవహించి, మన ఇద్దరి శరీరములలో పారుచున్న రక్తధారను, నేడు ఆ నాళముల ఛిన్నమొనర్చి భూతలమున వర్షింప చేసెదవా? ఇదో ద్వారమును మూసివేయుచున్నాను, ఇదో నా కరవాలము, నా అనాచ్ఛాదిత వక్షమున నీ మనస్కామములు పూర్ణమగునటుల చేయుము

నక్షత్రరాయలు

క్షమింపుము, అన్నా క్షమింపుము, క్షమింపుము

గోవిందమాణిక్య

రా వత్సా! తిరిగి రా. ఈ పాపమునకు తిరిగి నన్ను క్షమించమని కోరుచున్నావా! ఈ మాట విన్నతోడనే క్షమించుట పూర్తి ఆయెను. నిన్ను దండించుటకు నేను అశక్తుడను.

నక్షత్రరాయుడు

ఈ దుర్బోధకుడు రఘుపతి. అతని బారినుండి నన్ను రక్షించుము.

గోవిందమాణిక్య

వత్సా! నీకు ఎట్టి భయమును లేదు.

---

తృతీయ దృశ్యము

[అంతఃపురమునందు]

**గుణవతి**

అట్టుల కాలేదు. కొన్నినాళ్లు కఠినముగ నుండిన ప్రేమతృష చేతనే తాను తిరిగివచ్చునని ఆశించితిని. ఇంతటి అహంకారము మనమున ప్రబలియుండెను. పెడముఖము పెట్టియుంటిని, మాటలాడకుంటిని, కంటతడిపెట్టక నిలచితిని, కేవల శుష్కరోషమున, నిర్లక్ష్యమున అశ్రద్ధతో కొన్నినాళ్లు

ఒరే బాలకా, నా బిడ్డలకై నియమితమైన ఆసన
మును దొంగిలించి తీసికొంటివి నాకు బిడ్డలు పుట్టలేదని,
వారి తండ్రి ప్రేమపై భాగముకొరకు ప్రాకులాడుచున్నావు
రాజహృదయపు సుధాపాత్రినుండి నీవే మొదటి గుక్కను
పుచ్చుకొంటివి, రాజకుమారులు వచ్చినపుడు నీ యెంగిలి
ప్రసాదమునా వారుపొందుట, ఒరే రాజద్రోహి

తల్లీ! మహామాయీ, ఎంతటి నిఉపేక్ష! ఎంత
సృష్టి, ఎన్ని లీలలు నీవి! నీ లీలావిలాసములలో ఒక్క
బిడ్డను నాకు ప్రసాదింపుము జనని, అనుగ్రహింపుము నా
ఒడిని నింపు, ఇంతటి చిన్న శిశువునే కనికరింపుము నీవు
దేని మిక్కలిగ ప్రేమించెదవో, దానినే నీకు సమర్పిం
చెదను

(నక్షత్రరాయని ప్రవేశము)

నక్షత్ర, ఎచ్చటికి చనుచున్నావు? తిరిగిపోవుచున్నా
వేల? నీ కంతటి భయమెవరివలన? నేను స్త్రీని, నిరస్త్రను
బలహీనను, నిరుపాయను, అసహాయను, నేను అంతటి
భయంకరముగ కాన్పించుచున్నానా?

నక్షత్రరాయలు

వలదు, వలదు, నన్ను పిలువకుము

గుణవతి

ఏల, ఏమాయెను

నక్షత్రరాయలు

నేను రాజుకాను

గుణవతి

కాకిపోయి కాకపోయెదవుగాక! అట్లని ఇంతటి విభ్రమిగుట యేల?

నక్షత్రరాయలు

చిరకాలము రాజు బ్రతికవలయును నేను యువ రాజుగనే ఉండి చచ్చెదను

గుణవతి

అట్లనే చావుము శీఘ్రముగనే చావుము నీ మనోరథము పూర్ణమగునుగాక, బ్రతికయే యుండుమని నీ కాళ్లపై బడి వేడుకొంటినా?

నక్షత్రరాయలు

సరె వచ్చితిని ఏమి చెప్పదలచితివో, చెప్పుము

గుణవతి

నీ ముకుటమును దొంగిలించిన చోరుని తొలగ దీయుము బోధపడెనా?

## చతుర్థ దృశ్యము

(మందిర సోపానముల జయసింహుడు)

### జయసింహ

దేవీ, ఉన్నావా, నీవు ఉన్నావా? నిలిచి ఉన్నావా? ఈ అసీమరజని యొక్క కట్టకడపటి భాగముననైనను ఒక్క క్షణమాత్రముగనైన ఉంటివేని, అచ్చటినుండి మిక్కిలి చిన్న స్వరముననైన పలుకుము, 'వత్సా, ఉన్నాను' అని నాతో చెప్పుము

లేదు, లేదు, లెదు, దేవిలేదు లేదా? దయచేసి ఉండుము, ఓ మాయామయియగు మిథ్యా, దయచేసి, జయసింహునిపై దయచేసి, సత్యమైలెమ్ము నా ఆ శైశవ భక్తి, నా ఆజన్మప్రేమ నీకు ప్రాణ మొసగజాలదా? ఇంతటి మిథ్యవా నీవు?

జయసింహా, ని అసువుల ఎవరిక అర్పించితివి? సత్య శూన్యము దయాశూన్యము మాతృశూన్యము సర్వశూన్య మగు స్థానమున సర్వము పారవైచితివే!

నీ మధుకంఠమున, ఆ నీ మధుభార నిమీలితనేత్రముల నా ముఖమువైపు నిగుడ్చి చెప్పుము

ఈ జనహీన స్తబ్ధరజనియందు, ఈ సమస్త జగత్తు యొక్క నిద్రామధ్యమున, చెప్పుము అపర్ణా, వేటినివిని, 'నాలుగవైపుల మరేమియులేను, కేవలము ప్రేమ తేలుచున్నది–పూర్ణిమ సుప్తరాత్రమున రజనీగంధ పుష్ప పరిమళమువలె,' అని ముదిని హత్తుకొను మాటల పలుకుము

అపర్ణ

అయ్యో జయసింహా! ఏమియు చెప్పజాలక యున్నాను ఎన్నో విషయములు మనమున ముకుళించి యున్నవి కాబోలు!

జయసింహా

అటులైన ఇంకను దగ్గర రమ్ము, మనస్సునుండియే మనస్సునకు ఆ విషయముల ప్రవహింపనిమ్ము

ఇదేమి చేయుచున్నాను, అపర్ణా, అపర్ణా!! వెడలిపో మందిరమును వదలి! ఇది గురు ఆదేశము

అపర్ణ

జయసింహా, అంత నిష్ఠురుడవు కాకుము సారె సారెకు మరల్చకుము నేను ఎంత ఓర్చుకొని సహించు చున్నానో దేవునికే ఎరుక

జయసింహ

అటులైన నేను పోయెదను ఒక్క నిముసము ఇచ్చట ఉండజాలను

(కొంచెము దూరముపోయి, తిరిగి) అపర్ణా, నేను నిష్ఠురుడనా? జయసింహుడు నిష్ఠురుడు, కఠినుడు అను నదియే నీ మనమున మిగిలి యుండునా? ఎన్నడును హాస వదనముతో నేను మాటలాడియుండ లేదా? ఎన్నడును దగ్గరకు పిలిచియుండలేదా? నీ కన్నీటిని చూచి కన్నీరు నేను ఎన్నడును రాల్చలేదా? అపర్ణా, అవి యన్నియు మనస్సునకురావా? జయసింహుడు నిష్ఠురుడు, పాషాణ హృదయుడనిమాత్రమేనా నీ మనమున మేల్కొని ఉండుట? దేవియని మనము పిలుచు పాషాణమూర్తివలెనే, నేనును పాషాణుడనా?

అయ్యో, చెలీ, నీవే దేవివై యుండిన, నా అంత ర్దాహము ఎంత దుస్సహమైనదో నీవు తెలిసికొనియుండెడి దానవు

అపర్ణ

బుద్ధిహీనము, వ్యధితము, క్షుద్రమగు ఈ నారీ హృదయమును మన్నించుము ఇక వచ్చివేయుము జయ సింహా, రమ్ము, ఇద్దరమును ఈ మందిరమును వదలి వెడ లెదము

జయసింహ

రక్షించుము, అపర్ణా, కరుణించుము దయచేసి నన్ను వదలి వెడలిపొమ్ము ఈ జీవితమున ఒకే కార్యము మిగిలియున్నది అదే ప్రాణమునకు ప్రభువై ఆధిపత్యము చెలాయింప నిమ్ము దాని స్థానమును నీవు లాగితీసుకొని ఆక్రమింపకుము (వడివడిగ వెళ్లిపోవును)

అపర్ణ

నూరుతూరులు సహించితిని, కాని నేనేల సహింప జాలకయున్నాను? నేడు ప్రాణము బద్దమై పోవుచున్నది?

---

పంచమదృశ్యము

[మందిరము]

(నక్షత్రరాయలు, రఘుపతి, నిద్రించుచున్న ధ్రువుడును)

రఘుపతి

ఏడ్చి, ఏడ్చి, నిద్రపోయెను జయసింహుడును ఇంత చిన్నతనమున తల్లిదండ్రులు లేనివాడుగ నా ఒడిలోనికి వచ్చెను ఆ నాడు ఇటులనే క్రొత్తగ నల్గడల చూచి ఏడ్చెను అచ్చటనే, దేవిచరణములకడనే అటులనే కొంచ ఊపిరితో రొప్పి, రొప్పి, ఏడ్చి అలసి నాయంత్రమువరకును

నిద్రించెను ఇతనిని చూడగా, అతని ఆ శిశుముఖము, శిశుక్రందనము మనస్సునకు వచ్చుచున్నవి

నక్షత్రరాయలు

స్వామీ, ఇక ఆలసించకు, రాజుకు ఎప్పుడు ఈ వార్త తెలియునో యని భయమగుచున్నది

రఘుపతి

ఈ వార్త అతని కెటుల తెలియగలదు నాలుగు ప్రక్కలు నిశీథపు నిద్రలచే పరివేష్టితము గదా!

నక్షత్రరాయలు

ఒకసారి ఎవరో ఛాయనుచూచితినా యనునట్లున్నది

రఘుపతి

నీ భయపు ఛాయనే

నక్షత్రరాయలు

ఎవరి ఆక్రందనస్వరమును వింటినాయనునట్లున్నది

రఘుపతి

నీ హృదయంపు స్వరమునే మన నిరానందము దూరమై పోవలయును రమ్ము మద్యపానము చేసెదము తలంపు మనస్సున యున్నంతవరకు పెద్దదిగ కాన్పించును, కార్యరూపమున పెట్టునప్పటికి చిన్నదై పోవును ఎంతయో

పెద్దదగు ఆవిరి ఘనీభవించినపుడు ఒక్క బిందు జలము మాత్రమగును

ఏమియు లేదు, ఒక్క నిముసపుపని ప్రదీపపు శీర్ణశిఖను ఆర్పుటకు ఎంత కాలము పట్టును? నిద్రనుండి ఒక క్షణిక కాలమున గాఢతమమగు దీర్ఘనిద్రలోనికి ఆ ప్రాణరేఖ కలిసి పోగలదు శ్రావణ నిశీథమున సౌదామిని మెరసి అంతర్ధాన మగునటుల, దాని పిడుగు మాత్రము శాశ్వతముగ రాజ దంభమున గ్రుచ్చుకొని పోగలదు

రమ్ము, రమ్ము, యువరాజా, నోట మాట, నవ్వు లేక ఒక మూల వాడినటుల ఏల కూర్చొనియున్నావు, ఏదో పెద్దగండము వచ్చినటుల రమ్ము ఈ ఆనందసలిలముల పానము చేసెదము

నక్షత్రరాయలు

చాల ఆలస్యమాయెను నేటికి బలిని నిలిపివేయుము రేపు పూజ జరుగగలదు.

రఘుపతి

ఆలస్యమైనది నిజమే రాత్రి తెల్లవారనున్నది

నక్షత్రరాయలు

అదో, కాలి చప్పుడులు వినబడుచున్నవి

రఘుపతి

ఏవి, నాకు వినవచ్చుట లేదు

నక్షత్రరాయలు

అదో వినుము అదో చూడుము వెలుతురు

రఘుపతి

రాజుకు తెలియవచ్చెను ఇక ఒక క్షణమైనను ఆలసింపకూడదు జై మహాకాళీ (ఖడ్గముమెత్తును)

(గోవింద మాణిక్యరాయలు, ఆతని సిబ్బంది వడివడిగ ప్రవేశింతురు రాజనిర్దేశ ప్రకారము సిబ్బంది రఘుపతిని, నక్షత్రరాయలను పట్టుకొనును)

గోవిందమాణిక్య

కారాగారమునకు గొంపొండు విచారణ జరుగగలదు

---

# చతుర్థ అంకము

## ప్రథమ దృశ్యము

[విచారణసభ]

(గోవిందమాణిక్య, రఘుపతి, నక్షత్రరాయలు,
సభాసదులు, సిబ్బంది)

గోవిందమాణిక్య

(రఘుపతిని చూచుచు) చెప్పుటకు ఇంకేమైనకలదా?

రఘుపతి

ఏమియు లేదు

గోవిందమాణిక్య

అపరాధమును ఒప్పుకొనుచున్నావా?

రఘుపతి

అపరాధమా? నిజమే అపరాధము చేసితిని కడపటికి దేవీపూజను చేయలేకపోతిని పొగరున మూఢుడనై అకార

ణముగ ఆలసించితిని దేవి దానికై శాస్తి నొసగుచున్నది నీవు నిమిత్తమాత్రుడవు

గోవిందమాణిక్య

అందరును వినవలయును ఇదే నానిర్ణయము పవిత్ర పూజామిషచే దేవివద్ద రాజాజ్ఞను తిరస్కరించి ఏ మోహాంధుడు జీవబలి నొసగునో, లేక దానికై ప్రయత్నముల చేయునో, అతనికి నిర్వాసన దండము నొసగుచున్నాను రఘుపతీ, అష్టవర్షములు నిర్వాసనమున నీవు గడపవలసియుండును నలుగురు సైనికులు నిన్ను తీసుకొనివెళ్లి రాజ్యమునకు వెలుపల వదలివచ్చెదరు

రఘుపతి

ఈ జగత్తున దేవివద్ద తప్ప మరి ఎవరివద్దను మోకాళ్లను వంచి ఎరుగను నేను విప్రుడను, నీవు శూద్రుడవు అయినను చేతులు జోడించి, మోకాళ్లనువంచి నేడు నిన్ను ప్రార్థించుచున్నాను రెండు దినముల గడవు శ్రావణ మాసపు కడపటి రెండు దినములు నాకు గడువు నివ్వకోరుచున్నాను బాద్రపద శుక్ల ప్రథమ ప్రత్యూషమున నే నీ ఈ అభిశప్త, దగ్ధరాజ్యమును వదలిపోయెదను తిరిగి ముఖము చూపను

గోవిందమాణిక్య

సరి, రెండు దినములగడువు నొసగుచున్నాను

రఘుపతి

మహారాజ, రాజాధిరాజా, మహిమాసాగరా, నీవు కృపావతారుడవు ధూళితుల్యమగు అధముడను, దీన దురదృష్టవంతుడను నేను (ప్రస్థానము)

గోవిందమాణిక్య

నక్షత్రా, నీ అపరాధమును అంగీకరింపుము

నక్షత్రరాయలు

మహారాజా, దోషిని నేను క్షమాభిక్ష కోరుటకు సాహసము లేక యున్నది (పాదములపై పడును)

గోవిందమాణిక్య

చెప్పుము, నీవు ఎవరి కుతంత్రములకులోనై ఈ కార్యమున పాల్గొంటివి? స్వభావముగ కోమల హృదయుడవు ఇంతటి దారుణ కార్యమునకు నీవు ఒడిగట్ట జాలవు

నక్షత్రరాయలు

ఇంక ఎవరిపై దోష మారోపింపగలను? ఈ పాపముఖముతో మరెవరి నామమును ఉచ్చరింపను నే నొక్క

డనే అపరాధిని నా పాపపు కుతంత్రములకు నే లోనై, తప్పు చేసితిని నీ తెలివిమాలిన తమ్ముని నూరుతప్పులు మన్నించితివి ఈ తూరియు మన్నించుము

గోవిందమాణిక్య

నక్షత్రా, చరణముల వదలిపొమ్ము మాట వినుము క్షమించుట నాకు చేతనైన పనియా! విచారణకర్తయు శాసనబద్ధుడు, నేరస్థునికన్న పెద్ద బంది ఒక అపరాధమున ఒకనికి శిక్షనొసగి, మరొకని విడుచుట, దేవునికే లేని శక్తి అది మరి నే నెచ్చట!

అందరు

క్షమింపుము, క్షమింపుము, ప్రభూ! నక్షత్రుడు నీ సోదరుడు

గోవిందమాణిక్య

మౌనముగ నుండుడు ఈ ఆసనమున కూర్చొని యున్నంతవరకు, సోదరుడు, ఆత్మీయుడు నాకు ఎవ్వరును లేరు అపరాధము సప్రమాణమాయెను త్రిపుర రాజ్య సీమలవదలి, తీర్థస్నానముకొరకై బ్రహ్మపుత్రానదీతీరమున ఉన్న రాజగృహమున నక్షత్రరాయలు అష్టవర్షములు నిర్వాసనమున గడపవలయును

(సిబ్బంది నక్షత్రుని పట్టి తీసుకొనిపోవ ఉద్యుక్త లగుదురు రాజు సింహాసనమునుండి దిగివచ్చి)

విశ్వాసఘ్నులు కౌగిలింత యిచ్చి పొమ్ము, సోదరా! ఈ శిక్ష నీకు మాత్రమే కాదు, ఇది నాకును శిక్ష నేటనుండి రాజగృహము సూదులవలె, ముళ్లవలె నన్ను గ్రుచ్చుచుండ గలదు నా ఆశీర్వాదములు నీతో సదా ఉండగలవు దూరమున నున్నంతకాలము దేవతలు నిన్ను రక్షించుచుందురు గాక!

(నక్షత్రుని ప్రస్థానము)

(సభాసదులవైపు చూచి) సభాగృహమును అందరును వదలిపొండు కొంచెముసేపు నేను ఒంటరిగ నుండెదను

(అందరు నిష్క్రమింతురు)

(వేగమున నయనరాయని ప్రవేశము)

నయనరాయలు

మహారాజా, విపదలు వరుసగ వచ్చుచున్నవి

గోవిందమాణిక్య

రాజు మానవుడు కాడా? అయ్యో విధీ, దీనాతిదీనులతో సమానముగ అతని హృదయము విలపించుచున్నది అందరివలె దుఃఖముల నిచ్చెదవు కాని, కన్నీరు కార్చుటకు తీరికనైన నొసగవా? ఏమి విపద, తోడనే చెప్పుము

నయనరాయలు

మొగల్ సైన్యములతో చంద్రపాలుడు వచ్చుచున్నాడు, త్రిపుర రాజ్యమును నాశనము చేయుటకొరకు

గోవిందమాణిక్య

నయనరాయ్, ఇది నీకు ఉచితముకాదు నిజమే, చంద్రపాలుడు శత్రువే కాని అతని పేరున ఇంతటి అపవాదమా?

నయనరాయలు

హీనులగు ప్రజలకు పెక్కుశిక్షల నొసగితివి కాని నాయెడ నేటి నీ అవిశ్వాసము అన్నిటికన్న పెద్దది దేవి శ్రీ చరణములనుండి పతితుడనైతిని, అట్లని అంత అధ పాతమునకు పోతినా?

గోవిందమాణిక్య

అన్నియు బాగుగచూచి తెలిసికొని, మరల చెప్పుము

నయనరాయలు

మొగలులతో కలసి చంద్రపాలుడు నిన్ను రాజ్యచ్యుతుని చేయకోరుచున్నాడు

గోవిందమాణిక్య

ఈ వార్త నీకెట్లు తెలిసినది?

నయనరాయలు

ప్రభూ, నన్ను నిరస్త్రునిచేసిననాడు, అస్త్రహీనలజ్జచే దేశాంతరమునకు వెడలితిని, అస్సాంవారికి మొగలులకును విరోధము నాగుచున్నదని వింటిని అందుచే అచ్చటి రాజ సన్నిధానమునకు సైనికపదవిని కోరుటకు వెడలితిని మార్గ మున త్రిపురవైపునకు మొగల్ సైన్యములు, వారివెంట చంద్రపాలుడు వచ్చుచుండుట కాంచితిని విచారణపై వారి ఒడంబడిక తెలిసికొంటిని, రాజపదములకు పరుగెత్తి వచ్చితిని

గోవిందమాణిక్య

ఈశ్వరా, ప్రపంచమునకు హఠాత్తుగా ఏమాయెను రెండుమూడు దినములక్రిందట ధరణి ఎచ్చటనైన రంధ్రము పడి, నాగవంశమంతయు తండోపతండములుగ రసాతలము నుండి బయటకువచ్చి, పృథ్వికి నాలుగువైపుల అడుగడుగున పడగల ఎత్తుచున్నట్లున్నది ప్రళయకాలము అరుగు దెంచెనా?

ఇది విస్మయమునకు సమయముకాదు

సైన్యభారమును వహింపుము

## ద్వితీయ దృశ్యము

[మందిర ప్రాంగణము - జయసింహుడు, రఘుపతి]

### రఘుపతి

గర్వము, తేజము, బ్రాహ్మణత్వము అన్నియు అహ గంటెను వత్సా, ఇక నేను, నిక గురువును కాను నిన్న నేను గురుగౌరవమున నిస్సంకోచముగ ఆదేశముల నొసగితిని నేడు అనునయములతో భిక్షనడుగుటకు మాత్రము అధికారము గలదు

దేని బలమున ఐశ్వర్యజ్యోతిని, రాజప్రతాపమును తిరస్కరించి తుచ్ఛమొనర్చుచుంటినో, ఆ అంతరదీప్తి ఆరి పోయినది జారిపోయినది రాలిపడిపోయిన నక్షత్రముకన్న మట్టిదీపము శ్రేష్ఠతరమైనది కుతూహలభరులై ఆ ఖద్యోతముకొరకు మట్టిలో వెతికి తిరుగులాడినను, గొరకదు దీపము అనుదినము ఆరును, అనుదినము వెలుగును తారలు ఒకసారి ఆరిన ఇక శాశ్వతముగ అంధకారము

నేనును చిరదీప్తిహీనుడను దేవతయొక్క అతిక్షుద్ర దానమగు ఈ పరమాయువు అతిసామాన్యమైనది దానిలో రెండునాళ్లు, రాజద్వారమున జానువులవంచి భిక్ష నడిగి

తీసికొంటిని జయసింహా, ఆ రెండుదినములును వ్యర్థము కాకుండుగాక! ఆ రెండుదినములు తమ కళంకముల కడిగి, తొలగదీసి, గతించనిమ్ము వాటి నల్లటిముఖము రాజరక్త ముచే ఎర్రనై పోవునుగాక

వత్సా, ఏల నిరుత్తరుడవు? ఇక గురు ఆదేశము కాదు అయినను బాల్యమునుండియు నిన్ను పెంచి పోషించినదానికై ఎట్టి అనురోధమును తగదా? పితృహీనునకు నేను తండ్రికన్న అధికుడగు తండ్రివలె ఉండలేదా? ఇన్ని మాటలతో దానిని స్మరణకు తెవలసివచ్చెనే యనునది విషాదకరము కృపాభిక్షను సహించవచ్చును, కాని ప్రేమ భిక్షను కోరు అభాగ్యుడు యాచకులలో అధమయాచకు డగును

వత్సా! ఇంకను నిరుత్తరుడవే! జానువులు మరల ఒకతూరి వంగనిమ్ము నా ఒడిలోనికి వచ్చినపుడు నీవు ఇంతవాడవు, నా మోకాళ్ల ఎత్తునను లేకుంటివి అట్టి నీకడనే ఈ మోకాళ్లు వంగనిమ్ము పుత్రా, భిక్షను కోరు చున్నాను

జయసింహ

తండ్రి, ఈ విదీర్ణవక్షమును, ఇంకను వజ్రముచే కొట్టుము దేవి రాజరక్తమునుకోరిన, అటులనే తెచ్చి

యిచ్చెద కోరినదంతియు యిచ్చెదను ఋణమంతయు తీర్చియే పోయెదను అటులనే జరుగగలదు, అటుల జరుగగలదు (ప్రస్థానము)

రఘుపతి

అటులనె కానిమ్ము దేవి కోరుచున్నదనిగా నీవు యిచ్చునది? నేనన్న లక్ష్యములేమి కాలేదు! హా కృతఘ్నుడా! దేవి నీకేమి చేసిపెట్టినది? శిశుకాలమునుండి దేవి నిన్ను అనుదినము పాలించినదా? ఎను రోగమువచ్చిన, సేవ చేసినదా? ఆకొన్న అన్నమిడెనా? జ్ఞానపిపాసను తీర్చెనా? కడపటికి దేవి, హృదయమును విస్తరించి కృతఘ్నతయొక్క వ్యధనుగైకొనెనా? అయ్యో కలికాలము సరే కాని

---

## తృతీయ దృశ్యము

[ప్రాసాదములోని ఒకగది గోవిందమాణిక్య నయనరాయల ప్రవేశము]

నయనరాయలు

విద్రోహి సైనికుల మరల్చి తీసుకవచ్చితి యుద్ధపు వేషములతో సన్నద్ధులైయున్నవారలు, మహారాజా, ఆజ్ఞనొసగుము, ముందుకు వెడలుటకు-ఆశీర్వదించుము

గోవిందమాణిక్య

రమ్ము, సేనాపతీ స్వయముగ రణక్షేత్రమునకు నేను వెడలెదను

నయనరాయలు

ఈ దాసుని మేన ప్రాణమున్నంతవరకు, నెమ్మదిగ నుండుము మహారాజా, విపదముఖమున పడి—

గోవిందమాణిక్య

సేనాపతి, అందరి విపద-అంశములో నేనును భాగస్వామిని కాకోరుచున్నాను నా రాజ అంశము, అందరికన్న ఎక్కువగ నుండవలెనుగదా! సైనికులారా, రండు, నన్ను మీ మధ్యకు తీసికొనుడు మీ నృపతిని దూరముగ సింహాసనాపీఠమున నిర్వాసితమొనర్చి, సమర గౌరవమునుండి వంచిత మొనర్పకుడు

(చారుని ప్రవేశము)

చారుడు

నిర్వాసన మార్గమునుండి కుమారనక్షత్రరాయని మొగలు సేనలు పట్టి తీసుకవెళ్లిరి రాజపదవికి అతనినే నిర్ణయించిరి సైన్యములతో రాజధాని వైపుననే వచ్చుచున్నాడు

గోవిందమాణిక్య

తీరిపోయినది ఇక భయములేదు యుద్ధము నిలిచి పోయినదన్నమాట

(ప్రహరి ప్రవేశము)

ప్రహరి

శత్రుశిబిరమునుండి ఉత్తరము వచ్చినది

గోవిందమాణిక్య

నక్షత్రుని వ్రాత ఇది శాంతి సమాచారముగనుండ వచ్చునని తలచెద—ఇదెట్టి దయజూపు సమాచారము! ఇది నక్షత్రుని భాషకానేరదు నేను రాజ్యమును వీడి వదలి పోవలయునట, లేకున్న సువర్ణత్రిపుర రక్తస్రోతమున తేలి పోగలదట, దేశమును దగ్ధము చేసెదరట, త్రిపురారమణులు మొగల్ అంత పురమున బానిసలయ్యెదరట! ఇదో, ఇదో, ఈ చేవ్రాలు అతనివ్రాతయే "మహారాజ నక్షత్రమాణిక్య" మహారాజ!

చూడుము సేనాపతి-రాజుచే దండితుడు రాజునకే నిర్వాసన దండము విధించి, వెడలగొట్ట చూచుచున్నాడు! భగవంతుని లీలలు ఎట్టివి?

నయనరాయుఁడు

నిర్వాసనమా? అబ్బా, ఎంత సాహసము యుద్ధము పూర్తికాకనే?

గోవిందమాణిక్య

ఇవి మొగలు సైన్యములు కావు త్రిపుర రాజపుత్రుఁడు రాజగుటకు అభిలషించుచున్నాఁడు అందులకై యుద్ధమేల?

నయనరాయుఁడు

రాజ్యమునకు శుభ—

గోవిందమాణిక్య

రాజ్యమునకు శుభమే కాఁగలదు ఎదురెదురుగ యిద్దరు సోదరులు నిలిచి, ఒకరొకరి భ్రాతృవక్షముల లక్ష్యమొనర్చి ప్రాణహంతకములగు అస్త్రముల సంధించుటలో రాజ్యమునకు శుభము కాఁగలదా? రాజ్యమున సింహాసనము మాత్రము కలదు గృహస్థుల గృహములు లేవా? సోదరులు లేరా? భ్రాతృత్వబంధనములు లేవా దానిలో?

చూడనీ, మరల చూడని, ఇది అతని చేతి వ్రాతయేనా? నక్షత్రుని స్వంతరచన కాదు నేను "బందిపోటు

దొంగను దేవద్వేషిని ముందు వెనుక తలంపులేనివాడను ఈ రాజ్యమునకు అమంగళ కరుడను!" కాదు కాదు ఇది అతనిరచనకాదు— రచన యెవరిదైనను, అక్షరములు అతనివే వాని చేతులతో వ్రాసినది నిజము ఏ సర్పపు విషమైనను, నిజ అక్షరముఖముల దానితో నింపి నా వక్షమున విసరెను

దైవమా, ఇది నీ శాస్త్రియేనా-కాదు, కాదు నిర్వాసనమా! అట్లనే కానిమ్ము అతని నిర్వాసనశిక్షను అతనికి మారుగ నేనే నీరవముగ వినమ్రశిరమున వహింపగలను

# పంచమ అంకము

## ప్రథమ దృశ్యము

[మందిరము—బయటతుపాను]

(పూజోపకరణముల గైకొని రఘుపతి)

### రఘుపతి

ఇన్నిదినములకు దేవి మేల్కొన్నదని తలచెద. ఇవి ఆమె రోషహుహుంకారములే! శాపముల ఉచ్చరించుచు, నగరముపైగా పరుగెత్తుచు వెడలిపోయెను తిమిరరూపిణి అదో, వారు నీ ప్రళయసఖీగణము కాబోలు, దారుణక్షుధచే విశ్వమహాతరువును బలవత్తరముగ కదలించుచున్నారు! నీ దీర్ఘ ఉపవాసము నేటితో తీరిపోగలదు. భక్తుల సంశయములలో త్రోసి, ఇన్నిదినములు ఎచ్చటనుంటివి దేవీ? ని ఖడ్గమును నీవు ఎత్తకున్న, మేము ఎత్తగలమా? నీ చండీమూర్తిని చూడచూడ ఎంత ఆనందమగుచున్నది! చిత్తము సాహసముతో నిండుచున్నది. సంశయములు తొలగిపోయెను. గౌరవము పోగొట్టుకొన్నవారు, తలవంపులైన

వారు, నూతన తేజమున శిరముల నెత్తుచున్నారు అదో కాలిచప్పుడు వినబడుచున్నది, అదే నీపూజ వచ్చుచున్నది జయము, జయము మహాదేవికి

(అపర్ణ ప్రవేశించును)

మాయావినీ, దూరముగ వెడలుము పొమ్ము జయసింహుడు కావలెనా నీకు? ఓసీ, సర్వనాశనకారి, మహాపాతకీ!

(అపర్ణ ప్రస్థానము)

ఇదేమి అకాలవ్యాఘాతము! ఒకవేళ జయసింహుడు రాకున్న! ఎప్పటికిని అటుల కానేరదు అతను ఎన్నడును సత్యభంగ మొనర్చువాడు కాడు జయము మహాకాళికి, సిద్ధిధాత్రికి, జయము భయంకరికి—ఏదైన ఆటంకములు సంభవించిన—కడపటికి పట్టుబడిన—అతని కావలివారల చేతులలో అసువుల పోగొట్టుకొనిన! మాతా, అభయా జయము భక్తసహాకారిణీ జయము జయము మాతా జాగ్రత దేవీ, సర్వజయా జయము, జయము శత్రుపక్షము నిశ్శంక కౌతుకమున చూచి నవ్వునటుల నీ భక్తవత్సలుల దుర్నామము ప్రపంచమున వెల్లడి కాకుండునుగాక నీ సంతానమునకు మాతృఅభిమానగర్వము చూర్ణమైపోయిన, తల్లీయని పిలుచుటకైన ఎవరును అవసరము లేదా? అదో పదధ్వని వాస్త

వముగ జయసింహుడే, నృముండమాలినీ, పాషండదళినీ, మహాశక్తీ జయము, జయము

(జయసింహుడు వడివడిగ ప్రవేశించును)

జయసింహా, రాజరక్తము ఏది?

జయసింహ

ఉన్నది, ఉన్నది నన్ను వదలుము స్వయముగ నన్నే నివేదింపనిమ్ము దయామయీ, జగత్పాలినీ, మాతా రాజరక్తము నీకు కావలయునా? నీ తృష ఇక దేనితోను తీరజాలదా? నేను రాజపుత్రుడ నాపూర్వపితామహులు రాజ్యముల ఏలిరి ఇప్పుడును నామాతామహవంశమువారు రాజ్యము ఏలుచున్నారు— రాజరక్తము నాదేహమున గలదు ఈ రక్తమునే సమర్పించెదను ఇదే కడపటి రక్తము కానిమ్ము మాతా! రక్తతృషాతురా, నీ అనంత పిపాస ఈ అంత్యరక్తముతో తీరిపోవునుగాక

(వక్షమున కత్తితో పొడుచుకొనును)

రఘుపతి

జయసింహా, జయసింహా, ఆహా! ఎంత నిర్దయ! ఎంత నిష్ఠురము! అంతయు నాశనముచేసితివిగదా! జయసింహా, కృతఘ్నుడా, గురుద్రోహి, పితృమర్మఘాతకా,

స్వేచ్ఛాచారీ, జయసింహా! కులిశకరినాత్మకా! ఒరే జయ సింహా, ఏకమాత్రప్రాణమా, ప్రాణాధికా, జీవనమంధన ధనమా? జయసింహా! ఓ నా వత్సా, గురువత్సలా! తిరిగి రమ్ము, తిరిగి రమ్ము, నిన్నుతప్ప మరేమియు కోరను అహం కారము, అభిమానము, దేవత, బ్రాహ్మణులు, అందరు పోయిన పోగాక! నీవు రా జయసింహా

(అపర్ణ ప్రవేశించును)

అపర్ణ

నన్ను పిచ్చిదానిని చేయుచున్నావు జయసింహా, ఎచ్చట జయసింహుడు?

రఘుపతి

అమృతమయీ, తల్లీ, రమ్ము నీ సుధాకంఠమున పిలువుము వ్యగ్రస్వరమున పిలువుము హృదయపూర్వక ముగ పిలువుము జయసింహుని పిలువుము నీవు అతనిని ఏవద్దకే తీసుకపొమ్ము, నేను కోరను

(ప్రతిమాపాదతలమున శిరమునుంచి అపర్ణ మూర్ఛిల్లును)

తిరిగి యిమ్ము, తిరిగి యిమ్ము, తల్లీ, తిరిగి యిమ్ము నా జయసింహుని

# ద్వితీయ దృశ్యము

[ప్రాసాదము]

(గోవిందమాణిక్య, నయనరాయలు)

గోవిందమాణిక్య

ఇప్పటికిని ఆనందధ్వనియా! లజ్జలేని రాజభవనము ఇంకను దీపమాలలచే శోభిల్లుచున్నది రాజధానీ బహిర్ద్వారమున ఉత్సవతోరణములతో కూడిన విజయ స్తంభములు పులకిత నగరపు ఆనంద ఉన్మాదమున ఎత్తబడిన రెండు బాహువులవలె వెలయుచున్నవి

ఇంకను ప్రాసాదమునుండి వెడలిపోకపోతిని—సింహాసనమును వదలకపోతిని ఇన్నాళ్లు రాజుగ ఉండియు ఎవరికిని ఎట్టి ఉపకారము చేయజాలకపోతినా? ఎట్టి దుష్కృత్యముల శాసనములచే నిరోధించజాలకపోతినా? నిర్వాసితమగు రాజా, ఛీ, ఛీ, నిన్ను నీవే విచారణచేసుకొని, నీ శోకమున నీవు అశ్రువులరాల్చుచున్నావు

మర్త్యరాజ్యముపోయెను, అయినను నేను నాకు రాజునే నా హృదయసింహాసనముపై నేడు మహోత్సవము సలుపబడునుగాక

(గుణవతి ప్రవేశము)

గుణవతి

ప్రియతమా, ప్రాణేశ్వరా ఇంకేల నాథా, దేవి నిషేధమును ఈసారి విన్నావుగదా! ప్రభూ, రమ్ము, నేటి రాత్రి కడపటి పూజ నొనర్చి సీతరాములవలె నిర్వాసనమునకు వెడలెదము

గోవిందమాణిక్య

ఓ ప్రాణేశ్వరీ, నేడు శుభదినము నాకు రాజ్యము పోయెను కాని నిన్ను తిరుగ పొందగలిగితిని మనోహరీ, రమ్ము దేవి మందిరమునకు ఇద్దరము వెడలెదము కేవలము ప్రేమతో, కేవలము పుష్పములతో, మిలన అశ్రువులతో, స్నేహ్ములు విశుద్ధ విషాదముతో వెడలెదము నేడు రక్తము వలదు, హింస వలదు

గుణవతి

భిక్షను మన్నింపుము, నాథా

గోవిందమాణిక్య

చెప్పుము, దేవి

గుణవతి

పాషాణుడవు కావలదు రాజ్యగర్వమును వదలి వేయుము దేవతయొద్ద పరాభవమును అంగీకరింపకోరనిచో,

నా ఆవేదనచూచియైన నీహృదయము నీరగుగాక! ప్రభూ, నీవు యెన్నడును నిష్ఠురస్వభావుడవు కావు ఎవరో నిన్ను పాషాణునిగ మార్చిరి! నా సౌభాగ్యమునుండి నిన్ను వేరు చేసి, ఎవరో నన్ను రాజరహితరాణినిగ చేసివైచిరి

## గోవిందమాణిక్య

ప్రాణేశ్వరీ, ఒక్కపరిమాత్రము నన్ను విశ్వసించుము నావైపుచూచి, తెలిసికొనకనే తెలిసికొనగలవు నా అశ్రువులచూచి, తెలిసికొనుము నన్ను ప్రేమించు ప్రేమతో తెలిసికొనుము—ఇక రక్తపాతము వలదు దేవీ, పెడముఖము పెట్టకుము ఇక నన్ను వదలకుము ఆశనిచ్చి నిరాశనొనర్చకుము మన్నించి పోదలచిన పొమ్ము

(గుణవతి ప్రస్థానము)

వెడలిపోయెను, ఎట్టి కఠినము, నిష్ఠురము యీ ప్రపంచము—ఎవరు అక్కడ?—ఎవరును లేరా? పోయి వచ్చెదను, సింహాసనమా, వీడ్కోలు నాపైతృకక్రోడమగు పుణ్యప్రాసాదమా, నిర్వాసితపుత్రుడు నీకు ప్రణామములనొనర్చి, సెలవుపుచ్చుకొనుచున్నాడు

## తృతీయ దృశ్యము

[అంతఃపురములోని గది—గుణవతి]

### గుణవతి

మ్రోగింపుడు, వాద్యముల మ్రోగింపుడు, నేటిరాత్రి పూజ కాగలదు నేడు నా ప్రతిజ్ఞ పూర్తి కాగలదు బలిని తెండు, జపా పుష్పముల తెండు నిలిచి ఉన్నారా? ఆజ్ఞల వినరా? నేనన్న మీకు లెక్కలేదా? రాజ్యము పోయినదని, నా దాసదాసీజనములు నా ఆదేశములు వినునంతటి రాణిత్వమును మిగిలి లేదా? ఇదో ఈ మురుగుల తీసుకొండు ఈ రత్నపుకంఠెను తీసుకొండు ఉన్న ఆభరణములన్నిటిని తీసుకొండు త్వరగ వెళ్లి, దేవీపూజకై ఏర్పాట్లుచేయుడు మహామాయా, ఈ దాసురాలిని నీ చరణములకడ నుంచుకొనుము

---

## చతుర్థ దృశ్యము

[మందిరము—రఘుపతి]

### రఘుపతి

చూడు, చూడు, మూఢ అజ్ఞునివలె జడపాషాణ ప్రతిమ ఎటుల నిలిచియున్నదో! మూగ, కుంటి, గుడ్డి,

చెముడు! నీకడ సమస్త వ్యథితవిశ్వము ఏడ్చిఏడ్చి చచ్చుచున్నది నీ పాషాణ చరణములకడ, మహత్తరహృదయములు జారి తమంతట తామే బ్రద్దలగుచున్నవి ఆహా, హా, హా, ఏ రాక్షసుని క్రూరపరిహాసమో ఇలలోకూర్చొని కాపురము చేయుచున్నది ప్రాణులు నిన్ను తల్లియని ఎంత పిలిచిన అంత ఘోరతర అట్టహాసములచే నవ్వుచున్నది కరిన అపహాసము ఇమ్ము తిరిగి జయసింహుని నాకు తిరిగి ఇమ్ము రాక్షసీ, పిశాచీ, తిరిగి ఇమ్ము

(ప్రతిమను ఊపి)

వినగలుగుదువా? చెవులున్నవా? ఏమిచేసితివో తెలుసుకొంటివా? ఎవరిరక్తము నీవు పానముచేసినది? ఏ పుణ్యచరిత్రుని రక్తమో తెలుసునా? స్నేహదయాప్రీతులతో నిండిన ఏ మహాహృదయపు రక్తమో?

ఇట్లనే చిరకాలముండుము, ఈ మందిరపు సింహాసనముననే సరళభక్తియెడల గుప్త ఉపహాసములచేయుచు ఉండుము—నీకు అనుదినము పూజల నొసగుచుందును, పదతలమున ప్రణామముచేయుచుందును, దయామయీ, మాతా అని నిన్ను పిలుచుచుండెద ఉపకారమును మరెవరి వద్దను బయటపెట్టను నాజయసింహుని మాత్రము నాకు తిరిగియిమ్ము—ఎవరివద్ద మొరపెట్టి విలపించుచున్నాను! అటు

లైనదూరము, దూరదూరము, దూరముగ గెంటివేయుము ఈ హృదయదళినీ పాషాణిని భూదేవివక్షము తేలికయగుగాక !

(దూర గోమతీ నదీజలములలో ప్రతిమను పారవేయును దివిటీలతో, వాద్యముల మ్రోగించుచు గుణవతి ప్రవేశము )

గుణవతి

జయము, జయము మహాదేవికి దేవి ఏది ?

రఘుపతి

దేవి లేదు

గుణవతి

గురుదేవా, దేవిని మరల రప్పించుము, తెప్పించి అనుగ్రహింపుము ఆమె రోషమును శాంతింపచేసెదను తల్లి పూజకై పూజను సమకూర్చితిని రాజ్యమును, పతిని అన్నింటిని వదలి, నా ప్రతిజ్ఞను పాలించితిని దయ ఉంచి, దయచేసి నేటి ఒక్కరాత్రికొరకైనను దేవిని మరల్చి తెమ్ము దేవి ఎచ్చట ?

రఘుపతి

ఎచ్చటను ఆమె లేదు పైనలేదు, క్రిందలేదు, ఎచ్చటను ఆమెలేదు, ఎచ్చటను ఎప్పుడును ఆమె లేనేలేదు

గుణవతి

ప్రభూ, ఇచ్చట ఉండెను గదా దేవి?

రఘుపతి

ఆమెనా దేవి అనుట? ప్రపంచమున ఎచ్చటైన నిజమగు దేవియున్న, ఈ పిశాచినిని దేవియని పిలుచుట ఎన్నడైన ఆ దేవి సహించగలదా? హృదయమును చీల్చి నిష్ఫలరక్తమును క్రూరపాషాణమూర్తి పదములకడ అర్పించుటలో మహత్వమెద్ది? ఆమెయా దేవి? పుణ్యరక్తమును పానమొనర్చి, మహారాక్షసికడుపు బ్రద్దలై చచ్చిపోయినది

గుణవతి

గురుదేవా, నన్ను బాధపెట్టకుము మరల సత్యముగ చెప్పుము, దేవి లేదా?

రఘుపతి

లేదు

గుణవతి

దేవి లేదా?

రఘుపతి

లేదు

గుణవతి

దేవి లేదా? అయిన ఎవరున్నారు?

రఘుపతి

ఎవ్వరు లేదు  ఏమియు లేదు

గుణవతి

తీసుకపొమ్ము  పూజను తీసుకపొమ్ము  తిరిగి పొమ్ము తిరిగి పొమ్ము  త్వరగా చెప్పుము, ఏ మార్గమున మహారాజు వెడలెను

(అపర్ణ ప్రవేశము)

అపర్ణ

తండ్రి

రఘుపతి

జననీ, జననీ, నా ప్రియజననీ, తండ్రి! ఇట్లు పిలుచుట నిందాపూర్వకముగ కాదుగద! తండ్రి! మాతా, జననీ, ఈ పుత్రఘాతకుని తండ్రియని ఎవరు పిలుచుచుండెనో, అతడు ఆ సుధాలిప్తమగు నామమును నీ కంఠమున నిడి చనెను, ఇంతమాత్రము దయచూపెను  ఆహా! మరల పిలువుము తండ్రి అని

అపర్ణ

తండ్రీ, రమ్ము ఈ మందిరము వదలిపోదము

(పుష్ప, అర్ఘ్యములతో గోవిందమాణిక్యుని ప్రవేశము)

గోవిందమాణిక్య

దేవి ఏది?

రఘుపతి

దేవి లేదు

గోవిందమాణిక్య

ఇదేమి రక్తధార!

రఘుపతి

ఇదే కడపటి పుణ్యరక్తము, ఈ పాపమందిరమున! జయసింహుడు నిజరక్తము నొసగి హింసారక్తశిఖను ఆర్పి వేసెను

గోవిందమాణిక్య

జయసింహా, ధన్యుడవు, ధన్యుడవు ఈ పూజా పుష్పాంజలిని నీకే సమర్పించుచున్నాను

గుణవతి

మహారాజా,

గోవిందమాణిక్య

హృదయేశ్వరీ, ప్రియతమా,

గుణవతి

నేడు దేవి లేదు నీవే నాకుగల ఏకైకదైవమవు

(ప్రణమిల్లును)

గోవిందమాణిక్య

పాపము శమించెను దేవి నేడు నా దేవి రూపమున తిరిగి వచ్చినది

అపర్ణ

తండ్రీ, వచ్చివేయుము

రఘుపతి

పాషాణము బద్దలై పోయెను—నా జనని ఈ సారి ప్రత్యక్షప్రతిమను చూపించినది - జననీ, అమృతమయీ—

అపర్ణ

తండ్రి వచ్చివేయుము

స

# పరిశిష్టము



(శాంతినికేతనమున 'విసర్జన' అధ్యాపనకాలమున నికేతన విద్యార్థులకు చెప్పబడినది)

'విసర్జన' ఈ నాటకపు నామకరణము ఏభావముపై ఆధారమాయెను? నాటకము కడపట రఘుపతి ప్రతిమను విసర్జించుట మనము చూడగలిగితిమి జయసింహుడు వాని ప్రాణమును విసర్జించి, రఘుపతి మనమున చైతన్యమును జనింప చేసెను

ప్రతిమావిసర్జనయే కాక ఈ నాటకమున అంతకన్న మహత్తర విషయము జయసింహుని ఆత్మత్యాగము— కారణము అప్పుడే రఘుపతికి సుస్పష్టభావమున ప్రేమ హింసామార్గమున పోదు విశ్వమాత పూజ్యప్రేమవలన సాధ్యమను సత్యమును తెలిసికొనగలిగెను ఈ మృత్యువుచే తాను పోగొట్టుకొన్నతను, ఎంత శ్రేష్ఠుడో ఎరుగ గలిగెను మేకపిల్ల విషయమున ప్రాణము ఎంత సత్యమగు సంగతియో

అపర్ణ తెలిసికొనగలిగెను, కాని రఘుపతి తెలిసికొనుటకు సమయముపట్టెను ప్రియజననిని దారుణ భావమున పోగొట్టు కొని, ప్రాణపు విలువ ఎంత అధికమైనదో అతనికి ఆఘాతె మొనర్చిన ఎంత వేదనయగునో తెలిసికొన గలిగెను

ఈ నాటకమున తుదివరకు ప్రేమ – ప్రతాపములు అను రెండు భావముల మధ్య పోరు జరుగుచున్నది రఘుపతికి ప్రభుత్వపు కోర్కెతో గోవింద మాణిక్యుని ప్రేమ శక్తితో విరోధము సంభవించినది రాజు ప్రేమను, రాజ పురోహితుడు నిజప్రభుత్వమును విజయవంతము చేయ దలచిరి నాటకానంతమున రఘుపతి తన ఓటమిని ఒప్పు కొనవలసివచ్చెను అతనికి చైతన్యము కల్గెను, తెలిసి కొనుటకుగల అడ్డంకులు దూరమాయెను, ప్రేమ గెలు పొందెను

నాటకపు ప్రథమ అంకమున, మొదటనే రాణి గుణవతి కాన్పించుచున్నది ఆమెకు సంతానము లేదని, సంతానలాభమును పొందుకోర్కెను దేవికి విన్నవించుటకు మందిరమునకు వచ్చెను "దయయుంచి నాకు సంతానము నిమ్ము, నాకు అన్నియు నున్నవి, దాసదాసీజనములు గలరు, దేనికని కొరతలేదు కాని నాతెప్తవక్షమున, నా ప్రాణము మధ్య ఇంకొక ప్రాణమును అనుభవించుటకు కోర్కె ఒడము చున్నది" అని ఆమె దేవికి విన్నవించెను "నా నిజప్రాణము

కన్న ఎక్కువ ప్రేమనుచూపుటకు తగినట్టి ఒక ప్రాణమును కోరుచున్నాను శిశువన్న స్వల్పప్రాణపు కణికయే కాని దానిని ప్రేమించుటకై మాతృప్రాణము వ్యాకులతచెందు చుండును దానికి జన్మనొసగి, బ్రతికించి పోషించి, అతని యెడల అతనికై కూర్చబడిన సమస్తప్రేమను అర్పించెద" ననియు మొరపెట్టుకొనెను

నాటకము గుణవతియొక్క ఈ వ్యాకులప్రార్థనతో ఆరంభమగుట యేల?

దానికి కారణము, ప్రథమముననే, ప్రాణము కొంచె మైనను, ప్రేమవద్ద దానివిలువ ఎంత అధికమో యను విషయము సుస్పష్టమై కాన్పించుచున్నది ఒకవైపు రాణి మ్రొక్కుకొనుచున్నది, విశ్వమాతవద్ద మేకపిల్లను బలి యిచ్చెదని ఇంకొకవైపు బలికిమారుగ చిన్నప్రాణకణము నకై ఆమె హృదయపు ఉచ్ఛ్వసితప్రేమను వర్షించి, ఆనం దింపకోరుచున్నది ఒకవైపు ప్రాణహత్యవిషయమున సంపూ ర్ణముగ అంధముగనున్నది, ఇంకొకవైపు ప్రాణముయెడల ప్రాణమునకుగల మమత ఎంతపెద్దవస్తువో ఆమె తెలిసి కొనెను రాణిమనమున ఒకచోట, ప్రాణమునకై ప్రాణము పడు తహతహ కాన్పించుచున్నది దానికొరకు లోకులు నిజప్రాణములనుగూడ తుచ్ఛపరచుకొనగల ప్రగాఢప్రేమ అందుకలదని తెలిసికొనగలిగెను, ఇంకొకవైపు అసహాయ

ప్రాణుల ప్రాణక్రందనములు ఆమె హృదయములో ప్రవేశింపలేకున్నవి

అటుపై ప్రథమఅంకమున, ఆ మాటను తెలుపుటకై అపర్ణవచ్చెను "నీవు ఒక ప్రాణముయొక్క ఆదరము ఎంతయో తెలిసికొనజాలితివి, నీవు తల్లివై ప్రాణమును లాలనమొనర్చుటకై వ్యాకులపడుచున్నావు, అందులకై విశ్వమాతవద్ద ప్రార్థించుచున్నావు, అటులైన అన్యప్రాణమును బలియిచ్చి ఈ ఉద్దేశ్యమును సాధింపదలచితివి విశ్వమాతకు ప్రాణమన్ననేమో తెలియదా? ప్రాణహత్యయందు ఆమె ఆనందపడునా? ఆమెకు ఇది తెలియునెడల, ఇట్టిభిక్షను ఆమెవద్ద ఎటులచేసితివి" అని అపర్ణ అనుచున్నది తల్లి మూలమున, ప్రాణమమత ఎట్ల విశ్వమున ప్రకాశము పొందునో ప్రథమదృశ్యమున అపర్ణ చెప్పిపోయెను గుణవతి సంతానముపొందుటకై వందమేకల బలినివ్వకోరుచున్నది ఆమెప్రాణము నిటుల వృధాగ నాశనముచేయ ఒప్పుకొనుచున్నది, కాని ఆ మ్రొక్కుబడిలో ఎంతకారిన్యముకలదో ఆమె ఆలోచించిచూడలెదు

ప్రాణపువిలువ ఎంత గభీరమో ఒకదళమువారు తెలిసికొనిరి ఇంకొకదళమువారు తెలిసికొనలేక పోయిరి అందుచే రెండు దళములలోను విరోధము సంభవించెను

గుణవతి, రఘుపతి ఒకవైపు, గోవిందమాణిక్య, జయసింహుడు, అపర్ణలు ఇంకొకవైపు చేరిరి

జయసింహుడు రఘుపతిని తండ్రివలె భక్తితో చూచుచుండెను అతను బాల్యమునుండి మందిరపు సకల అనుష్ఠానముల, పశుబలుల చూచి అభ్యస్తుడైపోయెను అందుననే 'ప్రేమగలచోట రక్తపాతము కాజాలదు'— ఈ ఉపలబ్ధి అతనిమనమున సంపూర్ణరూపమున స్థానముపొందుటకు ఆలస్యమాయెను అపర్ణక్రందనమే ప్రథమమున అతని పూర్ణ విశ్వాససంబంధమున సంశయముకా మొదలిడెను

గోవిందమాణిక్యుడు యీ పశుబలులమధ్య లిప్తుడైలేడు, కాని జయసింహుడు బాల్యమునుండి రఘుపతిచే పెంచబడెను ఆలోచనాశక్తి ఉదయించక పూర్వమునుండి, ఈ రక్తపాతము చూచిచూచి అభ్యాసమాయెను అందుననే అతనిమనస్సున రెండు భావములు వైరము వహించెను— రఘుపతియెడల భక్తి, బలియెడల చిరాభ్యాసపుజడత్వము ఈ అభ్యాసపు కఠినబంధనములు అతనిమనస్సు నెంతవరకు మొద్దుపరచినవో! అయినను క్రమక్రమముగ ఎంతటి పెద్ద అన్యాయమును తాను సమర్థించుచు వచ్చెనో ఆతడు తెలిసికొనగలిగెను

అపర్ణవచ్చి జయసింహుని మనమును చంచలపరచెను అపర్ణ ఒడిలోనికి తీసుకొని పాలించుచుండిన జీవముయొక్క

రక్తధారయే మందిరసోపానములపై ప్రవహించినది, ఈ దృశ్యమునుచూచి ఆమె ఏడ్చివేసినది జయసింహుని మనః మును దానితో కదలికపొందెను అతను ప్రతిమవైపుతిరిగి "ఇదేమి, నిమాయ, ఈ హత్యచే మానవుల ప్రాణములు క్రందనముచేయుచున్నవి నీవు విశ్వజననివయ్యు దీని సాయపడుచున్నావు, నీకు దయయనునదిలేదా?" అని అడిగెను జయసింహునిమనము ఆచారబంధనములలో ఆబద్ధమై యుండెను ఆతను ఈ తొలి కలయికనుపొంది, క్రమక్రమముగ అతని హృదయమున ఈ సంగ్రామము పెరిగి, ఒకరూపు పొందుచుండెను రెండుశక్తులు జయసింహుని రెండువైపులకు లాగసాగెను ఒకవైపున అపర్ణ మందిర మును వదలమని చెప్పుచుండెను, మరియొకవైపున రఘుపతి మందిరపుసీమలోనే ఉంచకోరెను

రఘుపతి మనమున దయ, మాయలులేవు అతడు కఠిన ఆచారమును పాలించుచు వచ్చెను, ఈ విధముగనే శక్తిని గడించి పెద్దవాడయ్యెను అతను దేవీసేవకుడని ప్రజలవద్ద సన్మానములు, పలుకుబడిని పొందుచువచ్చెను అతను జయసింహుని తన వక్షమున చేర్చుకొనకోరెను మందిరపు ఆచారముల సురంగములో కట్టివేయ కోరెను కాని అపర్ణ మరియొక వ్యతిరేకపు శక్తితో జయసింహుని వద్ద వచ్చి నిలిచెను ఆమె 'ఈ నిర్దయపూజలో కూర్చొని నీవు

నివసింపకుము, మందిరమును వదలి బయటకు రమ్ము,' అని చెప్పెను జయసింహుని చిత్తమున ఈ పోరు చెలరేగెను ఒక దళమువారు బాహ్యశక్తిని, ప్రాచీన ప్రథను శాశ్వతి పరుపకోరెదరు మరొకదళము ప్రేమయే అన్నిటికన్న పెద్ద దగు వస్తువని చెప్పుచున్నారు జయసింహుడు ఈ రెంటి మధ్యపడి, ఏది మేలైన త్రోవయో ఆలోచించి తెలిసికొన ప్రయత్నింపసాగెను

రఘుపతి పండితుడు, వృద్ధుడు, సన్మానితుడు, శక్తిశాలి, మరి అపర్ణ బాలిక, భిక్షుకురాలు, సంఘమున ఊరు పేరు లేనిది కాని ఏ శక్తి ఈ నాటకమున జయము పొందెనో, అపర్ణ ఆశక్తినే వ్యక్తపరచెను పైకి ఆమె దుర్బల యని తోచును, కాని క్రియకు ఆమెయే జయముపొందెను రఘుపతి శక్తిశాలియయ్యును, అతని వైపుననే శాస్త్రవిధులు, దేశాచారములు, లౌకికుల అభిప్రాయములు ఉన్నను, క్షుద్ర బాలిక వేషమున, సత్యము ప్రేమ పేరిట మందిరమున ప్రవేశించి విశ్వమాతయొక్క మూర్తిని ప్రతిష్ఠ చేసి వెడలెను ప్రేమకు సైన్యసామంతులు, అర్థ ప్రతిపత్తులు లేవు - కాని హృదయపు గోపనదుర్గమున దానిశక్తి సంచితమగుచుండును

రవీంద్రనాథ ఠాకూర్

---